ఓం.

# ఈశ్వరతారావళి

---

[illegible]

జనమంచి సీత[illegible]

సహోపాధ్యాయుఁడు,

ఆర్. సి. హెచ్. హైస్కూలు,

పిఠాపురము.

---

రెండవకూర్పు 500.

---




శ్రీవిద్వజ్జనమనోరంజనీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

పిఠాపురము.

1921.

వెల రు 0–1–6.

ఓం.

# విజ్ఞప్తి.

భక్త్యమృతంబును సహృదయహృదయంగమంబుగ నిండుసేయు భాగవతాదిపురాణరత్నంబులును, శతకరాజంబులును, దారావళులును తెలుఁగున నెక్కుడుగనున్నవని యెఱింగియు నే నీ చిన్ని పొత్తముఁ బ్రకటింప సాహసించుటకుఁ బ్రధానహేతువు నిర్మలమార్గప్రవృత్త్యభిలాషయే తప్ప మఱియొకండు గాదు. మదనుభవనిద్ధంబులైన యభిప్రాయంబుల నిందు వెల్లడించితిని. ఇది చదివి యొకఁ డానందించినను నిక్కంబుగ ధన్యుఁడననియే భావింతు.

ఇది రెండవకూర్పు. ప్రథమముద్రణములోని పద్యములు కొన్ని తీసివేసి, క్రొత్తవి కొన్ని చేర్చితిని. పాఠకమహాశయులందఱు గుణలేశంబుమాత్రమే గ్రహింపఁ బ్రార్థితులు.

"గీ. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని
కలుగనేటికిఁ దల్లుల కడుపుచేటు."

పిఠాపురము.
26-9-1921.

జనమంచి సీతారామస్వామి.

ఓం.

# ఈశ్వరతారావళి.

---

ఉ. శ్రీరమణుండ వీవనియె
 ఱింగియు సంపదలిమ్మటంచు ని
న్గోరనుగాని నీకొఱకుఁ
 గూర్చెద వాక్సుమదామమెంతయో
కూరిమితోడఁ; దోడ్పడుము;
 కొంచెపువాఁడని వీడఁబోక, నా
నేరము లెంచఁబోక మది
 నిల్పుమి నెయ్యముమీఱ నీశ్వరా. 1

ఉ. ఎంతగఁ గొట్టుకొన్న మన
 సెన్నఁడు నీవయి నిల్వలేదయో!
చింత మునుంగుచుండుఁ, బలు
 చిక్కులఁ ద్రోయుచునుండు, నెప్డు

ర్భ్రాంతులఁ బట్టియుండు, గరు
వంబుననిక్క, యర్థేచ్ఛఁదిర్గుఁ, గా
నంత సుఖంబులేదు నిజ
మయ్యా కృపామతిఁగావు మీశ్వరా. 2

ఉ. అక్కఱలేదు వాహనము,
లక్కఱలేదు యశంబు, స్తోత్రమా
యక్కఱలేదు, జవ్వనులు
నక్కఱలే దధికారయోగమా
యక్కఱలేదు, నిక్కము గ
నక్కఱలే దిల నెట్టిభోగముల్
చిక్కులు పెట్టకుండ ననుఁ
జెంతను జేర్చినఁజాలు నీశ్వరా. 3

చ. వినయముఁ ద్రోఁపనీదు ; మద
వృద్ధికిఁ దోడ్పడుఁ ; బెంచు గర్వముఁ ;
గనులను జూడనీదు ; మఱి
కర్ణములన్విననీదు ; బంధుల
న్మనుపటియట్లు సన్నిధికిఁ
జేరఁగనీ దధికారరోగమే.

మనుజుని బట్టుకొన్నఁ; దగు
మందునొసంగి కుదుర్పఁజాలు వై
ద్యునిఁగన మీభువిన్ సకల
దుర్గదహారివి నీవ యీశ్వరా. 4

చ. కలిమి యనర్థమంచుఁ బలు
కందగుమాట నిజంబ; కాని, యా
కలిమికినున్న శక్తి మతి
కల్గునె దేనికైనఁ? గల్మిచే
ఖలుఁడును నీకులేని ఘన
గౌరవమొందుచు, విద్యనేర్చువా
రల నిలఁ ద్రోసిరాజని, ని
రంకుశుఁ డౌనుగదయ్య యీశ్వరా. 5

చ. వదవద రాయటంచు ధన
వంతుల సేవకులీడ్చుచుండఁగా,
సదయతఁ జూడకేయనుచు
సాఁగిలి మ్రొక్కుచుఁ బొట్టకోసమే
గద యవమాన మెంతయినఁ
గాంచి సహింతురు దరిద్రు లక్కటా!

యుదరమునిచ్చి యన్నమిడ
  కుండుట న్యాయమె నీకు నీశ్వరా. 6

చ. వనితలపొందు కూడదని
  పల్కుచు నీతులు చెప్పువారలే
వనితనుగాంచిన న్దలలు
  వాల్ప రెగాదిగఁ జూతు రేలొకో?
మనుజుల మెప్పునొందఁగల
  మాటల నాడఁగవచ్చుఁగాని, యా
మనసునుబట్టి గెల్వఁగల
  మానవుఁ డెక్కడనుండు నీశ్వరా. 7

ఉ. అన్నిపరీక్షలందు జయ
  మందిన, వేతన మెంత తెచ్చినన్
మన్నన నెంతపొందినను
  మాటల నెంతటి వ్రిజ్ఞఁజూపినన్
బున్నము నొందలేఁడుగద
  పూరుషుఁడెవ్వఁడు నీతిలేనిచోఁ
దిన్నఁగదిద్ది నానడతఁ
  దీర్పవె నావరితాప మీశ్వరా. 8

ఉ. పంతముఁ బూనినట్లు పలు
బాములఁ బెట్టుట నీకుఁ బాడియే ?
యెంతగఁ గష్టపెట్టెదవొ !
యెవ్వఁడు నిన్ను మదిన్దలంచు నీ
వింతయుపేక్షచేసిన మ
తెవ్వరుదిక్కు మహానుభావ నా
చింతలఁదీర్చి శాంతిదయ
సేయు మనాథసుమిత్ర ? యీశ్వరా. ౯

చ. తెలియక కొన్నియున్దెలిసి
తెంపున నెన్నియొ ఘోరపాపముల్
పలుకులఁ జేఁతలన్మఱియు
భావముచే నొనరించి నందున
న్దలఁచి, తలంచి వాని, నను
తాపమునొందెడి నన్నుఁ బ్రోవఁగ
న్బలుమఱు నీదునామమును
భక్తి జపింతును దండ్రి, యీశ్వరా. 10

ఉ. పుట్టిననాఁటనుండియును
బొట్టకు బట్టకు దేవులాడు నే

నెట్టులు నిన్నుఁ గొల్వఁగల?
నెవ్వఁడు పోయిగనుండుఁ బ్రాణమి
కట్టులఁబాసి? నీవరమ
కారుణికత్వముఁ జూపవేల? నీ
కిట్టిపరాకుగల్గిన మ
తెవ్వరు రక్షకులౌదు రీశ్వరా. 11

ఉ. తప్పనియెంచ కెందఱనొ
దాసులపోలిక నాశ్రయించుచు
జెప్పఁగరాని దుష్క్రియలు
చేయుచు వితముఁగూర్ప మోక్షమే?
యెవ్వఁడు డబ్బుడబ్బనుచు
సేవలుపాట్లు వడఁగనేల? ని
న్దప్పక కొల్చుభాగ్యమును
దప్ప మఱేమియుఁగోర నీశ్వరా. 12

చ. తనువు ననుగ్రహించితివి
తావక సేవకుఁగాదె? కాని నీ
కనికరమున్నఁగాని యెటు
కల్గును మాకటువంటిభాగ్య? మే

ననయము దుష్పథంబుననె
యంధుఁడనై చరియించుచుంటి ; నా
మనవిని జిత్తగించి యిఁక
మక్కువతో నను జ్ఞానిఁజేయవే
తనయుఁడు తప్పొనర్చినను
దండ్రికిఁ దప్పునె ప్రేమ మీశ్వరా. 13

చ. మును దనుజాత్మజున్గరిని
ముప్పునఁబడక కాచినాడవం
చు నుతులుసేయనేల? యది
చోద్యమె? యాశ్రితలోల దీనుల
న్మనుచుట నీకు దీక్షగద
మమ్ములమ్మాత్రము చూడకుండువా
యని మది నమ్మియుంటి నిఁక
నైన నను సౌఖ్యమునంగు మీశ్వరా. 14

మ. సిరియున్నందునఁగాక వేఱుగతిఁ గొం
చెంబేనియు న్గౌరవా
దరసేవార్హతలేనిమానవుల చెం
తంజేరి మందాడుచు

ధరపై జీవనయాత్ర నల్పుఁ డతిచిం
తాహేతువై నక్కటా!
పరులన్వేఁడుటకంటె సజ్జనునకా
పత్తేది సర్వేశ్వరా. 15

చ. సిరులనుఁ రోసి సంతతముఁ
జిత్తము సేవయి నిల్పినాఁడు; నీ
చరితముఁ దేనెలుట్టిపడఁ
జక్కని యాంధ్రమునందు వ్రాసి, తా
నొరుఁగృతిభర్తఁ జేయుటకు
నొల్లక నీకది యిచ్చి తృప్తుఁడై
వఱలినవాఁడు పోతన; యు
వందిల నాతనిసాటి యీశ్వరా. 16

మ. కృతిలో దోషములెంచి యెంచి కవినా
క్షేపించు టేమంతగా
వ్రతసం బాకవికష్టమోర్చిదియొ కా
వ్యంబుల్ ప్రౌఢంబుగా
ఇతరుల్గాంచఁగలేరు; బిడ్డఁగనువ
న్నే బాధ చూలాలికిన్

క్షితిపైఁగల్గునొ గొడ్డురాలెఱుఁగునే
చెప్పంగ? సర్వేశ్వరా. 17

ఉ. ఎంతగ నర్థమున్న మన
క్షేమియు సౌఖ్యమొసంగ లేదు; తా
నంతయుఁ దోడ నుంచుకొనఁ
జాలము ప్రాణములూడిపోవుచో;
నంతటిదానికేల జను
లందఱు మోహముఁ జెందుచుందురో?
యంతయు నింద్రజాలమయి
నట్టులు తోఁచును నాకు నీశ్వరా. 18

మ. సదయాత్ముండవుగాన నిచ్చలును మా
సంరక్షణార్థంబె చే
యుదు వే కార్యమొనర్చిన న్ధరణి మే
మున్నంతకాలంబు, నా
కిదియీవే యిదియీవెయంచు మనుజుం
డజ్ఞానియై నిన్నుఁ దా
మదిఁ బ్రార్థింపఁగ నేల? నీవరయవే
మామేలు సర్వేశ్వరా. 19

చక్కఁగఁజాటు నీమహిమ
సర్వము నద్భుతలీల ; నందియుం
జెక్కడిదింక ? "నాస్తికుఁడ
నే" ననుమాధుఁడుగూడ రాత్రియుం
దక్కజమంది నిన్హృదయ
మందుఁ దలంపకయున్నె యీశ్వరా. 24

ఉ. రావణుఁజంప ధాత్రి రఘు
రాముఁడవై జనియించినప్పు డా
పావనమూర్తియౌ హనుమ
భక్తి సుధాంబుధిమున్గి నిన్ను సీ
తావనితామతల్లిని స
తంబును గొల్చినరీతి నేనునీ
సేవయొనర్చ నెన్నఁటికిఁ
జేకుఱునో? గద తండ్రి, యీశ్వరా. 25

ఉ. మానవజన్మ దుర్లభము
మాధవసేవను మానఁబోకుఁడో
మానవులార యంచు మతి
మంతులు పల్కుడు రైననేమి ? య

జ్ఞానుల కెట్టుకల్గు సువి
చారము నీదయ లేకపోయినన్
నే నవివేకిఁగానఁ గరు
ణించి ననున్ సవరింపు మీశ్వరా. 26

ఉ. చేయఁగనేర జన్నములు ;
చేయఁగ నేరఁ దపంబు లేవియు
న్జేయఁగనేర దానములు ;
చేయఁగ నేరను దీర్థయాత్రల
న్జేయఁగనేర శాస్త్రములు
చెప్పినచొప్పునఁ గర్మ మేదియున్
మాయలు లేక తెల్పితిని
మాయలు వన్నక పోవు మీశ్వరా. 27

---

చ. ఎఱుఁగను వేదశాస్త్రముల ;
నేమియు వ్యాకరణంబు రాదు ; నా
కరయఁ గవిత్వమందు నిసు
మంతయు నేరుపు లేదు తండ్రి నీ

కరుణనుమాత్ర నమ్మితిని ;
గావున దీనిఁ బరిగ్రహింపుమే
యఱమరలేక యంచు విన
యమ్మున వేఁడుదు నిన్ను నీశ్వరా.

౪. నీమంబున వ్రాసితి నిది
స్వామీ, మాయింటి పేరు "జనమంచి" యయా,
నామంబన్ననొ "సీతా
రామస్వామి" యనియెదవు రమ్యగుణాబ్ధీ.

